మంగళవారం జనవరి 30

శక 1889 పుష్య 25

## మద్రాస్-ఎ

416.7 మీ (720 కిలోసైౖ)
ఉ॥ 6-00 నుండి 11-00 వరకు
మ॥ 11-55 నుండి రా॥ 12-00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
31.28 మీ (9590 కిలోసై)
మ॥ 11-55 నుండి సా॥ 2-10 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6-05 నుండి రా॥ 11-00 వరకు

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, మంగళగానం
6-05 తుదిప్పాడల్ గళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 అంగ్లములో వార్తలు
6-45 సంగీతామృతం: కున్నకుడి వెంకట్రామ అయ్యర్
7-15 తమిళములో వార్తలు
7-30 అఖిలభారత నాటక కార్యక్రమము
8-30 వాద్య సంగీతం
8-45 సర్వోదయ దినం చర్చ (తమిళం)
9-15 అర్. పట్టమ్మాళ్: వీణ
9-45 వి. ఎస్. శ్యామారావు: గాత్రం
10-30 అమర ఒలి ప్రార్థనా సమావేశములలో గాంధీజీ ప్రసంగములనుండి కొన్ని ఘట్టాలు
10-40 మధురగీతం
10-35 అంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ శెయిదిగళ్
12-00* కార్మికుల కార్యక్రమము
12-30 పాఠశాలలకు (తమిళం)
1-00 స్త్రీలకు (తమిళం)
1-30 వాద్యగోష్ఠి
1-45 చిత్రగానం† పూజైకువంద మలర్
1-55 వాతావరణ సూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* గాంధీజీ రూపకం (తిరుచ్చినుండి రిలే)
6-00 విరామ సంగీతం
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 వాణిజ్య వార్తలు, కార్యక్రమ వివరణ, ప్రత్యేక ప్రకటనలు, వాతావరణ సూచన
6-30 సర్వోదయ దినోత్సవము ప్రసంగం ఎ. రామస్వామి
6-40 విరామ సంగీతం
6-45 చిత్రగానం† చంద్రోదయం, పంచవర్ణక్కిళి, నాన్ మనం ఒరు కురంగు, అయిరం రూబాయ్, నెంజిరుక్కుంవరై, పళని
7-15 తమిళములో వార్తలు
7-30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8-00 ఆటల సమీక్ష (తమిళం) ఎస్. సుబ్రహ్మణ్యం
8-10 విరామ సంగీతం
8-15 జనతా నగర్ సీరియల్ నాటిక రచన: కి రా.
8-45 Excerpts from the speeches of Nehruji on Gandhiji
9-00 అంగ్లములో వార్తలు
9-15 వి. వి. శఠగోపన్: గాత్రం (తిరుచ్చినుండి రిలే)
10-30 University of the Air For the Correspondence Course students
11-00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

211.3 మీ (1420 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-57 వందేమాతరం, మంగళధ్వని
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత మంజరి† ఎమ్. ఎమ్. దండపాణి దేశికర్
7-30 మాలిని కస్తూరి రంగన్: గాత్రం
8-00 అంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

ప్రసారము II
211.3 మీ (1420 కిలోసై)

1-00 Western music: Musical Portrait
1-30 అంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
211.3 మీ (1420 కిలోసై)
(5-30 నుండి 6-05 వరకు
(60.98 మీటర్లపైగూడా)

5-30* Western music: Hazel Biggs, Oscar Bernard, Maureen Borthwick
6-00 అంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-30 స్వాతంత్ర్య యోధులు: మహాత్మా గాంధీ ప్రసంగం బి. ఎస్. అర్. కృష్ణ
భక్తిగీతాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతమంజరి† ఎ. కె. సి. నటరాజన్: క్లారినెట్
7-30 చిత్రగానం† మహాకవి కాళిదాస్, కాత్తిరుంద కన్గళ్, అన్బు కరంగళ్, కన్కండ దైవం, మోటార్ సుందరం పిళ్లై, నిచ్చైవిళ్ నిండ్రవళ్, వాలిబవిరుందు
8-00 మాలిని కస్తూరి రంగన్, గాత్రం
8-30 Radio News Reel (relay from Delhi)
8-45 మద్రాస్ ఎ వలె
9-00 అంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 Western music British folk songs George Melachrino and Simprini
10-30 అంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

## బెంగళూర్

ఉ॥ ప్రసారము I

6-30* వందేమాతరం, మంగళధ్వని సుప్రభాత, విచారదీప్తి
6-40 అంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
7-15 మారెళ్ళ కేశవరావు: వయొలిన్
7-45 కన్నడములో వార్తలు
8-00 అంగ్లములో వార్తలు
8-15 గాంధీస్మృతి
8-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

1 30* వనితావిహార
1-00 ఎమ్. వి. యదుగిరి: గాత్రం
1-10 కన్నడములో వార్తలు
1 0 ఎమ్. వి. యదుగిరి: గాత్రం
1-30 అంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1- 0 ఎమ్. వి. యదుగిరి: గాత్రం
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
(బెంగళూరు, భద్రావతి)

3-00* ఉన్నతపాఠశాలలకు
3-30* ప్రసార సమాప్తి

ప్రసారము IV

5-30* కార్మికుల కార్యక్రమము
6-00 అంగ్లములో వార్తలు
6-05 స్థానిక ప్రకటనలు వాతావరణ సూచన (అంగ్లం)
6-10 వేణువు†
6-15 మానెయమాతు
6-25 వృందగాన†
6-35 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీతె†
7-00 గ్రామస్థులకు
7-05 కన్నడములో వార్తలు
8-00 సర్వోదయ సందేశ ప్రసంగం
8-10 వాద్యశ్రీ†
8-15 For the Universities
8-30 దిల్లీనుండి రిలే
8-40 వాద్యశ్రీ†
8-45 నవనుమ: హెచ్. ఎస్. అనసూయ
8-50 పంచతల గత్ సమర్పణ: ఎస్. కృష్ణస్వామి
9-00 అంగ్లములో వార్తలు
9-15 సమాచార దర్శన
9-25 వాద్య సంగీత
9-30 గాంధీజీ జ్ఞాపకాలు
10-00 గాంధీజీపై గేయాలు
10-15 భావసారథ
10-30 అంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

* సమయ సూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

## బుధవారం జనవరి 31

శక 1889 పుష్య 20

## హైదరాబాద్-ఎ

405.4 మీ (740 కిలోసై)
[80,42 మీ (3335 కిలోసై)
ఉ॥ 6-00 నుండి 7-45 వరకు]
(19,02 మీ 7150 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 8-30 వరకు
(42-02 మీ 7140 కిలోసై)
మ॥ 11-45 నుండి 12-0 వరకు
మ॥ 12-30 నుండి 2-00 వరకు
(62.50 మీ 4800 కిలోసై)
సా॥ 5-55 నుండి రా॥ 10-40 వరకు

ఉ॥ ప్రసారము I

6-30* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమవివరణ
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 భక్తిరంజని
7-00 తెలుగులో వార్తలు
7-15 వి. జి. జోగ్: వయొలిన్
7-45 సూక్తిముక్తావళి
8-00 ఆంగ్లములో వార్తలు
8-1 హిందీలో వార్తలు
8-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-45 ఉన్నత పాఠశాలలకు
నరకాసురవధ నాటిక
రచన: ఎమ్. భారతి
మీకు తెలుసా?
12-05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12-30* కార్మికుల కార్యక్రమము (విజయవాడనుండి రిలే)
1-00 మహిళా సమాజం
స్త్రీల కార్యక్రమము
సమైక్యతాగేయము
ఒక సర్వోదయ సేవికస్వగతం
పెద్దక్క- పెత్తనాలు
మాటా మంతీ
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 చిత్రసీమ†
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణసూచన ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-55* స్థానిక ప్రకటనలు
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాద్, కడపలు మాత్రమే)
6-25 ముఖ్య ప్రకటనలు
విరామ సంగీతం
6-30 వ్యాపసాయిక విషయాలు :
రసాయనిక ఎరువుల వాడుకలో జాగ్రత్తలు సంభాషణ
రాష్ట్రములో సాంఘిక సంక్షేమము సంభాషణ
ధరలు వాతావరణం
7-00 తెలుగులో వార్తలు
7-15 వెలుగు బాట
7-30 లలిత సంగీతం: ఎమ్. శాంత
7-45 విరామ సంగీతం
7-50 Vision of Nehru
8-00 భయం నాటిక
రచన: ప్రఖ్య శ్రీరామమూర్తి
8-30 డి. రామలక్ష్మి: గాత్రం
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 National Progromme of talks (relay from Delhi)
9-45 చిత్రసీమ†
10-00 డి. రామలక్ష్మి: గాత్రం
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 హిందీలో వార్తలు
10 40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## కడప

333.3 మీ (900 కిలోసై)
సా॥ 5-55 నుండి 10-40 వరకు
శనివారములు మాత్రము
సా॥ 5-55 నుండి రా॥ 11-10

## విశాఖపట్నం

322,6 మీ )(930 కిలోసై)
సా॥ 5-55 నుండి రా॥ 10-40 వరకు

## విజయవాడ

357. మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, సుభోదయం, ప్రసార విశేషాలు
6-10 భక్తిరంజని:
గణేశస్తుతి
కాలజ్ఞానతత్వాలు
6-40 ఆంగ్లములో వార్తలు
-45 సూక్తి ముక్తావళి
6-50 బజారు ధరలు
6-55 విరామ సంగీతం
7-00 తెలుగులో వార్తలు
7- 5 హైదరాబాద్ రిలే
7-45 హిందీ పాఠము
8-00 ఆంగ్లములో వార్తలు
8-1 హిందీలో వార్తలు
8-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-15* ఉన్నత పాఠశాలలకు (హైదరాబాద్‌నుండి రిలే)
12-05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12-30* కార్మికుల కార్యక్రమము
ఫిల్మ్ సంగీతం†
కుటుంబ నియంత్రణ ప్రసంగం
పి. ప్రభావతీదేవి
విశేషాలు
కుష్ఠురోగ నివారణవారము

## హైదరాబాద్-బి

288 మీ (1060 కిలోసై)

ఉ॥ ప్రసారము I

2-00* చిత్రపటోసే†
2-10 ఉర్దూలో వార్తలు
2-20 సుగం సంగీత్
2-30 ఉన్నత పాఠశాలలకు (ఉర్దూ)
2-50 సుగం సంగీత్
3-00* ప్రసార సమాప్తి

ప్రసారము II

8-00* చిత్రపటోసే†
8 30 వి. జి. జోగ్: వయొలిన్
9-00 సుగం సంగీత్
9-15 ఉర్దూలో వార్తలు
9-30 ఉర్దూలో కార్యక్రమము
10-00* ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో

1-00 మహిళా సమాజం
స్త్రీల కార్యక్రమము (హైదరాబాద్‌నుండి రిలే)
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-55* స్థానిక ప్రకటనలు
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 వాద్య బృందం
-30 మధువన్
హిందీ కార్యక్రమము
6-45 వెలుగుబాట
7-00 తెలుగులో వార్తలు
7-15 పంటసీమలు
విస్తరణ కార్యకర్తలకు విజ్ఞప్తి
గ్రామాలలో నిరక్షరాస్యత పరిచయము
జానపదగేయము
మార్కెట్టు ధరలు
సంచార గ్రంథాలయాల నిర్వహణ ప్రసంగం
వాతావరణము
7-45 ఈనెల పాట
7-50 వయొలిన్, యుగళం
నిలయవిద్వాంసులు
8-00 భయం నాటిక
రచన: ప్రఖ్య శ్రీరామమూర్తి (హైదరాబాద్‌నుండి రిలే)
8-30 చిత్రతరంగిణి-
ఫిల్మ్ సంగీతం†
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 National pragramme of talks (relay from Delhi)
9-45 లలిత సంగీతం
వేమూరి సత్యనారాయణ మూర్తి
10-00 వి. ఆర్. కృష్ణన్: గాత్రం
10-30 ఆంగ్లములో వార్తలు
10-33 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ—బి

300 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
వివరాలు 48-వ పేజీలో)



* సమయ సూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్థానిక రికార్డింగ్

బుధవారం జనవరి 31

శక 1889 మాఘ 11

## మద్రాస్-ఎ

4 6-7 మీ (720) కిలోసైౖ
ఉ॥ 6-10 నుండి 1-00 వరకు
మ॥ 11-5 నుండి గ॥ 5-00 వరకు
సా॥ 5-5 నుండి రా॥ 11-00 వరకు
6 -98 మీ 1920 కిలోసైౖ
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
31 28 మీ 95 కిలోసైౖ
మ॥ 11-55 నుండి 2-1 వరకు
6 .98 మీ 492 కిలోసైౖ)
సా॥ 6 05 నుండి రాత్రి 11-10 వరకు

ఉ॥ ప్రసారము I

6-01* వందేమాతరం, మంగళగానం
6- తువిప్పావైగళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ
వాతావరణ సూచన
6-35 అయళ్ వాక్కు
6-40 అంగ్లములో వార్తలు
6-45 సంగీతామృతం
టి. వి. నమశివాయం
7-1 తమిళములో వార్తలు
7-30 పామాలై†
మదురై మణిఅయ్యర్
8-15 మయూరం ఎస్. పార్థసారథి: గాత్రం
8-45 చిత్రగానం†
9-15 టి. వీరరాఘవన్: వయొలిన్
9-45 వాద్యసంగీతం;
10-00 జానమ్మా డేవిడ్: గాత్రం
10-30 For Schools
English lesson for Standard VI
Conducted by A. C. M. Russell
10-55 అంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ వార్తలు
2-0* కార్మికుల కార్యక్రమము
2-30 పాఠశాలలకు (తమిళం)
1-00 పెణ్ణులగం స్త్రీలకు
(తిరుచ్చినుండి రిలే)
1-30 వాద్యగోష్ఠి
1-45 చిత్రగానం†
సుమైతాంగి
1-55 వాతావరణ సూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

ప్రసారము III

5-30* సంగీత పాఠము
5-45 మెల్లిశై:
సీతా సుబ్రమణ్యం
ఆర్. ఎస్. బాలన్
6-00 విరామసంగీతం
6-01 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 కార్యక్రమ వివరణ
వాణిజ్య వార్తలు,
ప్రత్యేక ప్రకటనలు,
వాతావరణ సూచన,
6-30 వాద్యసంగీతం:
6-45 చిత్రగానం†
సర్పార్ సుందరం
నెంజిమకుండ్ర నరై
భామావిజయం
అవే కన్గళ్
ఊటివరై ఉరవు
అమ్మావెగె, రాము
7-15 తమిళములో వార్తలు
-30 వ్యవసాయదారులకు
(తిరుచ్చినుండిరిలే)
8-00 పుస్తక సమీక్ష,
వి. ఎస్. సుబ్బయ్య
8-15 మయూరం ఎస్. పార్థసారథి: గాత్రం
8- 5 Radio News Reel
9-00 అంగ్లములో వార్తలు
9-15 Economic Philosophy of Gandhiji: talk
9-30 టి. వీరరాఘవన్: వయొలిన్
10-00 చిత్రగానం†
ఇరువర్ ఉల్లం
పట్టణత్తిల్ భూతం
తంగై, అన్నైవా
కప్పలోట్టియ తమిళన్
నాన్, దైవచెయల్
10-30 University of the Air
Correspondence Course for students
11 00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

211 8 మీ 1420 కిలోసైౖ

ఉ॥ ప్రసారము I

6-57 వందేమాతరం, మంగళధ్వని
7- 0 తెలుగులో వార్తలు
7-15 సంగీత మంజరి
క్రైస్తవ పాడల్‌గళ్
ఎల్ ఆర్. ఈశ్వరి
టి. రాఘవమాణిక్యం
7-30 మద్రాస్ ఎ వలె
8-00 అంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
211,8 మీ (1420 కిలోసైౖ)

1-00 Western music:
Selections from the Pirates of Penzance
Gilbert and Sullivan
Jimmy shand and his band
1-30 అంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
211 8 మీ 1420 కిలోసైౖ
[సా॥ 5-30 నుండి 6-05 వరకు
60.98 మీటర్లపై గూడా]

5-30* Western music:
Jimmy Glasgow,
The Johnnie Pate Quintet
6-00 అంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-30 దగాపడిన చెల్లెలు నాటిక
రచన: అత్తిలి కృష్ణారావు
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత మంజరి†
వెల్లూరు రామభద్రన్: మృదంగం
ఎన్. రమణి: వేణువు
7-30 చిత్రగానం†
8-00 అంజలి
8 1 మద్రాస్ ఎ వలె
8-45 వాద్య సంగీతం:
వేణువు, వయొలిన్
9-00 అంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 National Programme of talks
(relay from Delhi)
9-45 వాద్య సంగీతం
10-00 Western music:
Earl Bostic and his orchestra
Billy Thoburn and his strict Tempo dance band
11-30 అంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన,
జనగణమన, ప్రసారసమాప్తి

## మద్రాస్-సి

198.5 మీ (1550 కిమీసైౖ)
వివిధభారతి (రిలే)
[వివరాలు 40వ పేజీలో

## బెంగళూర్

ఉ॥ ప్రసారము I
491.8 మీ (610 కిమీసైౖ)

-30* వందేమాతరం మంగళధ్వని
6-40 అంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6- 0 గీతారాధన
7-15 ఆర్. లీలాబాయి:
హిందూస్థానీ శాస్త్రీయ సంగీత్
7-45 కన్నడములో వార్తలు
8-00 అంగ్లములో వార్తలు
8-15 గానవిహార
8-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* చింతలపల్లి కృష్ణమూర్తి, గాత్రం
1-10 కన్నడములో వార్తలు
1-20 పి. ఎస్. సత్యవతి: గాత్రం
1-30 అంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 పి. ఎస్. సత్యవతి: గాత్రం
2-00 వాతావరణ సూచన
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

3-00* ఉన్నత పాఠశాలలకు
3-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-30* కార్మికుల కార్యక్రమం
6-00 అంగ్లములో వార్తలు
6-05 స్థానిక ప్రకటనలు
వాతావరణ సూచన (అంగ్లం)
6-10 వీణ†
6-15 సాహిత్య సాంస్కృతిక కార్యక్రమము (ఉర్దూ)
6-30 లలిత సంగీత†
6-35 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీత†
7-00 గ్రామస్థులకు
- 5 కన్నడములో వార్తలు
8-00 ప్రసంగం (కన్నడం)
8-10 వాద్యశ్రీ†
8-15 బి. జయమ్మ, ఎమ్. ప్రభాకర్,
ఎమ్. ఎస్. రత్న
8-30 ఆర్. లీలాబాయి:
హిందూస్థానీ శాస్త్రీయ సంగీత్
9-00 అంగ్లములో వార్తలు
9-15 చిత్ర గీత†
9-30 ఢిల్లీనుండి రిలే
9-50 సి. వి. నాగరాజ్: గాత్రం
10- 0 అంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన
జనగణమన, ప్రసార సమాప్తి

నిత్యజీవితంలోని హాస్యరస ఘట్టాలు :

# జంతు ప్రదర్శనశాలలో

ఎస్. రాఘవరావు

అందరూ ఆదివారాలు హాయిగా ఇంట్లో కూచొని కబుర్లు చెప్పుకుంటారు స్నేహితుల ఇండ్లకో, సినిమాలకో వెళ్తూ ఉంటారు. లేదా విశ్రాంతి తీసుకుంటారు, వారానికో రోజు యీ విధంగా. కాని నా విషయంలో మటుకు, "ఈ ఆదివారం నాది" అని చెప్పుకునేందుకు లేకుండా పోయింది. శారీరకంగానూ, మానసికంగానూ మనిషికి వారానికొక్క రోజైనా విశ్రాంతి ఉండాలి కదా. నాకు మనసులో వీక్లీ విశ్రాంతి తీసుకుందామని కోరిక ఉన్నా, అది జరగకుండా ఉంది. నేను చేస్తున్న ఉద్యోగం అటువంటిది. ఆదివారాలు కూడా పనిచేసే ఆ అదృష్టవంతుల కోవకి చెందినవాణ్ని. ఒకవంక పిల్లలు—నా సొంత పిల్లలు కాదనుకోండి—ఇంకోవంక ఆ పిల్లల తలితండ్రులూ ప్రతిరోజూ ఏదో పని మీద నాతో కలసి ముచ్చటిస్తూ ఉంటారు. అందువల్ల ఆదివారం వచ్చిందంటే ఈ కష్టానికి అంతులేదు. ఎవ్వరికీ చెప్పకుండా, ఎక్కడికేనా ఏకాంతంగా వెళ్ళి, ఒక్కడినీ హాయిగా, స్వేచ్ఛగా ఒకపూట తిరగాలని నా కోరిక. "పోనీ ఆదివారాలు సెలవు దినంగా తీసుకోడానికి వీలులేకపోతే ఇంకేరోజేనా తీసుకోకూడదా" అని కొందరు మిత్రులు సలహా ఇవ్వకపోలేదు. అసలు చిక్కు ఏమిటంటే అందరూ ఆఫీసుల్లో పనిచేస్తుంటూ ఉంటే, నేనొక్కణ్ణీ ఇంట్లో కూచొని ఏం చెయ్యను! అంచేత ఆదివారం రోజునే హాయిగా స్వేచ్ఛగా ఒక పూట తిరగాలని నా కోరిక.

అందుకు నేనొక ప్లాను వేశాను. అది ఒక ప్రణాళిక. నా సొంత ప్రణాళిక. రహస్య ప్రణాళిక. ఇంట్లో గానీ ఆఫీసులో గానీ ఎవ్వరికీ తెలియకుండా నేనొక్కణ్ణీ ఒకచోటికి వెళ్ళాలి. అక్కడ సుందర దృశ్యాలను చూస్తూ కాలం గడపాలి. ఇంట్లో అందరూ నేనెక్కడికి వెళ్ళానా అని ఆశ్చర్యపడి ఎదురుచూడాలి. చీకటిపడగానే నేను ఇంటికి తిరిగిరావాలి. అదీ నా ప్రణాళిక.

అనొక ఆదివారం. ప్రతి ఆదివారం నేను ఎక్కడ ఉంటానో, ఏ పని చేస్తుంటానో అందరికీ తెలుసు. కాని ఆనాడు మాత్రం నేను ఏదో సాకు చెప్పి నా పనిని తప్పించుకున్నాను. మధ్యాహ్నం సుమారు రెండు గంటలకి టాక్సీ చేసుకొని, టాక్సీలో ఎవ్వరూ చూడకుండా తల వంచుకుని కూర్చున్నా. టాక్సీ నన్ను తిన్నగా నెహ్రూ జూలాజికల్ పార్కుకి తీసుకొనిపోయింది.

వెళ్ళివెళ్ళి జంతు ప్రదర్శనశాలకు ఎందుకు వెళ్లావూ అని అడుగుతారేమో. అదొక ఆనందం. అసలు ముఖ్యవిషయం ఏమిటంటే జంతువులు మాట్లాడలేవు. పిల్లల్లాగ నా చుట్టూ మూగి నానా ప్రశ్నలూ వేయలేవు. నేను వాటికి సమాధానాలు చెప్పనక్కరలేదు. ఒక్కడ్నీ అలా నడుస్తూ వాటిని చూస్తూ హాయిగా తిరగొచ్చు. ఆ తరువాత ఫలహారశాలలో నాకిష్టమైన ఫలహారం చేయొచ్చు. బోటుషైరు హాయిగా వెళ్ళొచ్చు. నిజమైన విశ్రాంతి లభించే చోటు "ఇదా" అని నిర్ణయానికి వచ్చి అక్కడికి వెళ్లాను.

టాక్సీ దిగాను. దిగగానే ఎదురుగా కాకిడ్రెస్‌లో ఉన్న ఒకాయన, "నమస్కారమండి అన్నయ్యగారూ. ఒక్కరూ వచ్చారే" అని పరామర్శ ప్రారంభించాడు. ఇక్కడో చిన్న విషయం చెప్పవలసి ఉంది. నేను ఎక్కడికి వెళ్ళినా భార్యాసమేతంగా



ఎ. సుబ్బారావు: గాత్రం (బెంగళూర్, జనవరి 16)



ఈమని శంకరశాస్త్రి: వీణ (మద్రాస్, జనవరి 25)



టి విశ్వనాథన్ వేణువు (మద్రాస్, జనవరి 29)

వెళ్ళడం అలవాటు. ఆ దృశ్యానికి అలవాటుపడినవాడు పూర్తి ఇష్టంతో ఒక్కడు ఎక్కడికి వెళ్లినా ''ఏం బొత్తిరే వచ్చారే'' అన్న ప్రశ్నతో పలకరిస్తారు. ఆ శాకీడున్న లాయన అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పలేక, ఒక విధంగా బొనౌనన్నట్టు తల ఊపి, ఒక టికెట్టు తీసుకొని జూ లోనికి ప్రవేశించాను.

ఎదురుగా చిలుక పంజరాలు నన్ను ఆహ్వానించాయి. వాటిని చూస్తూ వాటి కేరింతలు వింటూ అలాకాస్సేపు నిలుచున్నాను. నా ప్రక్కనే నిలుచున్న ఓ అబ్బాయీ ఒక అమ్మాయీ చిలుకను చూడడం మానేసి నావేపే నిదానించి చూడడం ప్రారంభించారు. ఈ పిల్లలెవరో నన్ను గుర్తుపట్టి ఉంటారని అనుమానం వేసి, వాళ్ళని తప్పించుకుందుకు ఎడంవైపున ఉన్న కోతుల సాల దగ్గరికి గబగబ వెళ్ళిపోయాను,

అక్కడ ఒక పెద్దగుంపు చేరింది కటకటాల గదిలో ఉన్న కోతుల్ని ఓ 20, 30 మంది బాలలు అల్లరి పెడుతున్నారు. నేను అక్కడికి చేరగానే ఇద్దరు ముగ్గురు పిల్లలు నాకేసి చూసి గుసగుసలు మొదలు పెట్టారు, అందరూ ఆ కోతుల్ని చూడ్డం మానేసి నావేపు చూడ్డం ప్రారంభించారు ''అబ్బాయిలూ? నావేపు ఎందుకు చూస్తారూ. నేను కోతిని కాను, మనిషిని'' అని అనవలసి వచ్చింది. నా గొంతు వినగానే నలుగురైదుగురు పిల్లలు ''అన్నయ్యొయ్యొచ్చాడు అన్నయ్య'' అని అరవడం ప్రారంభించారు. ఒక్కక్షణంలో నాచుట్టూ ఓ 30 మంది పిల్లలు జమకూడారు,

నేను ఏ బాలబృందాన్ని తప్పించుకొని ప్రశాంతంగా వుందామని వచ్చానో ఆ బాలబృందమే ఇంకోటి ఇక్కడ తయారయింది. అంతటితో ఊరుకున్నారా ఆబాలలు.

''అన్నయ్యా ఇవాళ ప్రోగ్రాం లేదా? ఇక్కడి కెందుకువచ్చావు? ఒంటరిగా వచ్చావేం? అక్కయ్య రాలేదేం? ఎందుకు తెచ్చావుకావు? ఇలాంటి ప్రశ్నల వర్షం కురిపించారు నాకు పిచ్చెత్తినట్టయింది. అక్కడి నుంచి పారిపోవాలనిపించింది. కాని అది నాకు సాధ్యంకాలేదు.

ఇంతలోనే ఒక కొంటెపిల్లవాడు చొరవచేసుకుని కోతులబోను కటకటాల దగ్గరికి వెళ్ళి తన అరచేతిలోని పేరుశెనక్కాయలను ఒక కోతికి అందజేయ ప్రయత్నించాడు. ఆ బోనుకోనున్న నాలుగైదు కోతులూ ఒక్కసారి ఉరికి ఆ అబ్బాయి చెయ్యి పట్టుకొని లాగబోయాయి. అది చూడగానే ఆడపిల్లలందరూ కెవ్వున కేకవేశారు. అక్కడంతా గందరగోళంగా తయారయింది. ఎవరు నరులో ఎవరు వానరులో తెలియని పరిస్థితి ఏర్పడింది. దగ్గరలోనే ఉన్న ఒక జూ ఉద్యోగి తిన్నగా నాదగ్గిరికి అగ్గిరాముడులా వచ్చి! ''ఏమయ్యా, యీ న్యూసెన్సంతా ఏమిటి. మీ పిల్లల్ని డిసిప్లిన్‌లో ఉంచరేం'' అంటూ ఘర్జించాడు.

''ఈ పిల్లల్ని నేను తీసుకురాలేదయ్యా. నన్నంటావేం?'' అని నేను చెప్తున్నా వినిపించుకోక ''పిళ్ళని ఇక్కడినుంచి తీసుకుపొండి మాస్టరు గారూ, అని నన్ను మందలించాడు. నేను బడి పంతుల్నికాను, అని వాదించేకంటే ఆ మందలింపులను స్వీకరించటమే సజ్జన లక్షణం. ఉత్తమమార్గం అని తోచి! ''రండర్రా, అటు పోదాం'' అని అప్రయత్నంగా అన్నాను.

ఆదివారంనాడు హాయిగా ఏక్ నిరంజన్‌గా కాలం గడుపుదామని వస్తే, ఒక్కగంటలో ఇలా పరిణమించింది. జర్మన్ కథలోని పైడ్ పైపర్ ఆఫ్ హామెలిన్ మాదిరిగా నేను నడుస్తూ ఉంటే ఒక ఇరవై మంది పిల్లలు నావెంటా పడ్డారు.

మూడున్నర కావచ్చింది. నేనూ, నావెనకనే ఆ బాలబృందం, జూ క్యాంటీన్ సమీపంలో నడుస్తూ ఉన్నాం. నేను మొదట వేసుకున్న ప్రణాళిక ప్రకారం ఆ కాంటీన్‌కి నేనొక్కడినే వెళ్ళాలి. కాని ఇప్పుడొక కొత్త సమస్య ఎదురయింది. ఆ పిల్లల్ని వదిలి నేనొక్కణ్ణి ఏలా వెళ్ళగలను? జేబులోని పర్సుని ఒకసారి తడిమి చూసుకొని, ''రండర్రా కాఫీ త్రాగుదాం'' అని నావెంటొచ్చిన పిల్లల్ని ఆహ్వానించాను. నా ఆహ్వానాన్ని స్వీకరించి పిల్లలందరూ వాళ్ళలో ఒక కుర్రాడి అమ్మా, నాన్నా కూడా ఉన్నారు లెండి—అందరూ కాంటీన్ లోనికి ప్రవేశించి కుర్చీలలో ఆసీనులయారు.

ఇంతలో హోటలు సర్వరు రావడం, నేను 23 కప్పుల కాఫీకి ఆర్డరివ్వడం జరిగింది. నా దగ్గర కుర్చీలో కూర్చున్న ఒక అబ్బాయి చొరవగా ''ఒక్క కాఫీయేనా. టిఫిన్ కూడా ఉందా అన్నయ్యా'' అని అనేశాడు. ఇంకో అబ్బాయి మాకు కాఫీ వద్దు. టిఫిన్ కావాలి అన్నాడు. మాతో వచ్చిన ఆ ఇల్లాలు ''కూల్ డ్రింక్ కూడా ఇక్కడ దొరుకుతాయా'' అని సర్వర్‌ని అడుగుతోంది. ఇందరి బిల్లూ చెల్లించుకునే అదృష్టం నాకే పట్టినందుకు నేను బిక్కమొహంవేసి సంతోషించాను.

టిఫిన్ల ఘట్టం ముగిసింది. హోటలు వాడు నాచేతికి బిల్లును అందించాడు. నేను పర్సుతీసి పైకం చెల్లించబోతున్నాను. ఇంతలో ఎవరో ఒక పెద్దమనిషి, ఏడుస్తున్న ఒక నాలుగేండ్ల కుర్రాడ్ని బరబరా నాదగ్గరికి తీసుకొని వచ్చి, నావేపు సుర్రుసురా చూస్తూ ''ఏమండీ, యీ అబ్బాయిని ఆ పాములబోనువగ్గర వదిలేసి మీరు హాయిగా ఇక్కడ టిఫిన్లు ఆరగిస్తున్నారా, పిల్లల్ని అలా వదిలేస్తారటండీ చూడండి ఎలా ఏడుస్తున్నాడో మీ కోసం'' అని ఆ అబ్బాయిని నాదగ్గర వదిలి వెళ్ళిపోయాడు.

''ఆ అబ్బాయి మావాడు కాడండీ ఎవరో'' అని నేను సమాధానం చెపుతున్నా వినిపించుకోలేదాయన. ఇక అనుకోకుండా సంక్రమించిన ఆ నూతన వారసుణ్ని బుజ్జగించి వానికి బిస్కెతులూ, అవీ ఇచ్చి ఊరడించేసరికి నాతలప్రాణం తోక కొచ్చింది. దానితో సమస్య తీరిందా? అసలు ఆ అబ్బాయి ఎవరు?

''అబ్బాయీ, నీపేరేమిటీ?'' అని అడిగాను.

''బాబు'' అన్నాడు.

''అది కాదు బాబూ నీ అసలు పేరేమిటి? చెప్పూ. మీ ఇల్లెక్కడ? చెప్పు నాయనా, మీనాన్నగారి పేరు?'' అవి అడగబోతూ ఉండగా వాళ్ళ నాన్న ఎటునుంచో పిడుగులాగ వచ్చి ఆ అబ్బాయి వీపుమీద దబదబా బాదడం ప్రారంభించాడు.

''అరెరెరే వాడిని ఎందుకండీ అలా కొడుతారు పాపం. వాడేం చేశాడూ'' అని నేను అడిగేసరికి—

''వీడెప్పుడూ ఇంతేనండీ. తెనాలి స్టేషనులో కూడా ఇలాగే తప్పిపోయాడు'' అని ఆయన అన్నాడు.

''ఓహో, మీది తెనాలా అండీ'' అని నేను ప్రశ్న వేశాను.

''మీరెవరండీ. మీ గొంతు విన్నట్టుందే ఎక్కడో'' అన్నారాయన.

''ఈయనే రేడియో అన్నయ్యా'' అని గబుక్కున చెప్పాడొక బాలుడు.

ఆ మాటలు వినగానే ఆ తెనాలాయనకి ఆశ్చర్యం సంతోషం ఒక్కసారే కలిగి! ''ఏమేవ్, ఇలారా? ఈయనే రేడియో అన్నయ్య. అరుపులూ అన్నీ అరుస్తారూ రేడియోలో యీయనే'' అని దూరంగా ఉన్న భార్యను పిలిచాడు.

''ఇవాళ మా అదృష్టమండీ, జూలో మిమ్మల్ని కూడా చూడడం జరిగింది'' అని అన్నాడు.

పిల్లలందరూ ఫక్కున నవ్వారు. వాళ్లతోబాటు నేను కూడా నవ్వేశాను.

జీవితంలో ఇటువంటి మధుర ఘట్టాలు ఎన్నో మనకి ఎదురవుతూ ఉంటాయి మరీ.

# పుస్తక పరిచయము

సమీక్షకులు: కోటగిరి విశ్వనాధరావు

## సప్తస్వరాలు

కథాసంకలనము

ప్రకాశకులు-శ్రీ గోదా గ్రంథమాల. కృష్ణజిల్లా. ముసునూరు. మూల్యం తెలియదు.

ఈ సంపుటములో ఏడు కథలున్నవి. మాసమునకు కొన్నివందల క్రొత్తకథలు రచింపబడుచున్నవి. పత్రికలలో ప్రకటింపబడుచున్నవి. ఒక్క తెనుగుదేశమునందే ఇట్లు అసంఖ్యాకముగ కథలు వ్రాయబడుచున్నవని తలంప నక్కరలేదు. యావత్ప్రపంచములోను నేడు కథకే పట్టముగట్టుట జరుగుచున్నది. తెనుగుదేశమున రచింపబడుచున్న కథలలో కొన్ని ఉత్తమ ప్రపంచకథానికలలో సముచిత స్థానము పొందదగిన కథలుండుట సంతోషింపదగిన విషయము. ఈ సంపుటములో మొదటి కథ అభ్యుదయం—రచయిత శ్రీ బలివాడ కాంతారావుగారు. రెండవకథ నిత్యానందంగారి వివాహం-రచయిత శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారు. ఇది హాస్యరసప్రధానమైన కథ. నిత్యానందంగారు పెళ్ళిచూపులకు వెళ్ళినపుడు పెళ్ళికూతురు యొక్క సమాధానము లెట్లున్నవో చూడుడు....అశోకచక్రవర్తి గొప్ప చక్రవర్తి. ఆయన రోడ్లు త్రవ్వించెను. జంతువులకు మరమ్మత్తు చేయించెను. ఆసుపత్రులు వేయించెను, చెట్లను కట్టించెను....ఇట్లే అమాయకుడైన నిత్యానందంగారి వివాహం హాస్యప్రధానంగా సాగినది. మూడవకథ ఒరవడి. రచయిత భమిడిపాటి రామగోపాలంగారు. ఒక కలెక్టరుగాథ తన చిన్ననాటి స్నేహితుడు. యీనాడు తన క్రింద ఉద్యోగము చేయుచున్న సుబ్రహ్మణ్యమునకు అతని అర్ధాంగిని అభివృద్ధిలోనికి తెచ్చు మార్గము నుపదేశించుటయే యీ కథలోని ఇతివృత్తము. కథ సొగసుగానే నడచినది. నాల్గవ కథ—స్వాతి చినుకులు. రచయిత శ్రీ దాశరధి. దాశరథిగారు సుప్రసిద్ధ కవి. స్వాతిచినుకులు చదివినచో దాశరధి ఉత్తమ కథానికా రచయిత కూడనని స్పష్టమగును. వైహాయస వీధులలో విహరించు విమానయువతి నీలాసుందరికి, జానపదగీతములు పాడు సీతారాంకు జరిగిన పరిణయమే యీ కథలోని ప్రధాన విషయము. ఈ కథలో నుత్తమకథా శిల్పమున్నది. దాశరధి ఉత్తమ కవి కూడ కాబట్టి సొగసైన ఊహలను కథలో నెల్లయెడల వెదజల్లినారు. ఐదవకథ శ్రీమతి భాస్కరమ్మగారి ఇద్దరి అబలలు....ఆవేశములో తప్పటడుగువేసిన రజియా పరమదయనీయమైన స్థితిలో ఆసుపత్రిలో ప్రవేశించును. అక్కడ రాధ అను నర్సు ఆమెకు సర్వోపచారములుచేసి చివరకు రజియా భావిజీవిత మార్గమును తీర్చి దిద్దును. ఈ కథలో రాధ పరోపకార పరాయణత్వము కారుణ్యాది గుణముల రాశిగా భాసించుచున్నది.

విహారి శాలివాహనులు రచించిన పండుటాకులు అను కథ మానవ మనస్తత్వమునకు సంబంధించిన కథ. ఈ కథలో రామానికి ఉన్న సంబంధము అస్పష్టమైనదని రచయితలు ముందుగా చెప్పినప్పటికి రామం వ్యక్తిత్వమే చదువరుల మనస్సులపై గాఢమైన ముద్ర వేయును. అందుచేతనే జగన్నాధంగారి మంచి చెడులను గురించి పాఠకుడు పట్టించుకొనడు. చివరి కథ బీనాదేవిగారి విద్యుల్లత విరిసింది. ఒక ధనికుడు ఒక పేదవాడు కారు ప్రమాదములో చిక్కుకొని ప్రాణాపాయ స్థితిలో డాక్టర్ సుబ్రహ్మణ్యం కడకు తీసికొని రాబడుదురు. వారిద్దరకు శస్త్రచికిత్స చేయవలెను. కాని ఏ ఒక్కడు రెండవవాని శస్త్రచికిత్స పూర్తియగువరకు జీవించడని డాక్టరు గ్రహించును. అట్టి పరిస్థితిలో ఎవనికి ముందు శస్త్రచికిత్స చేసి ప్రాణదానము చేవలెను? అను ఘోరసమస్యలో డాక్టరు చిక్కుకొనును కడకు ధనికునికే చికిత్స చేయుటకు డాక్టరు పూనుకొని వానికి ప్రాణదానము చేయును. యీ శస్త్రచికిత్స పూర్తియగు లోపల పేదవాడు చనిపోవును. ముందుగా ధనికునకు వైద్యము చేయుటకు నిర్ణయించుకొనిన డాక్టరు నిర్ణయము ఆలోచించినచో సముచితముగనే కనుపించుచున్నది. కథ సంఘర్షణా పూరితమై ఉజ్వలముగా నున్నది. బీనాదేవిగారు యీ కథలో నుపయోగించిన ఉపమానములు ఆమె ప్రతిభాశక్తిని స్పష్టము చేయుచున్నవి.

'కన్నతల్లి ప్రేమలా చల్లగాలి అతనిని కౌగలించుకుంది' అని అనుట—

'నల్లకిటికీ అద్దం మీద పడిన వాన చినుకు స్త్రీ చెంపమీది కన్నీరులా మెల్లగా జారింది.'

అనుట బీనాదేవిగారి కవితాశక్తి నభివ్యక్తము చేయుచున్నవి.

---



ఆర్. కె. శ్రీకంఠన్: గాత్రం (బెంగళూర్, 28)

# రసజ్ఞుని భావనలో శ్రీనాథకవి

[4-వ పేజీ తరువాయి]

ఆకలిబాధ కోర్వలేక వ్యాసుడు కాశీని శపించిపోతాడు. అప్పుడు ఒక విప్రభవనంబు వాకిట పార్వతి ప్రాకృతి వేషంబున వస్తుంది ఎలాగా అంటే.

వేసవి పాటపాట నరవెండ్రుకతో తిలతండు లాన్వయ
శ్రీనటియింప కైసడలి ప్రేకని చన్నులు పాలవంకకై
కౌ నసియార్చ వాలుతెలిగన్నుల కల్కితనంబు వీడ్కొనన్
వేదపురాణ శాస్త్రపదవీ నదలీయసియైన పెద్ద ముత్తయిదువ

రత్న కటకాభరణంబులు ఘల్లు ఘల్లుమంటుంటే మునీశ్వరా రమ్మని పిల్చి

ఆ కంఠంబుగనీవు మాధుకర భిక్షాన్నంబు భక్షింపగా
లేపున్నన్ కడుసంగలార్చెదవు మేలేలెస్స శాంతుడనే
నీకంచెన్ మతిహీనులౌ కఅకటా నీవార ముష్టింపచుల్
శాకాహారులు కందభోజులు శిలోంఛ వ్రతముల్ తాపసుల్

అని శిష్యులతోకూడా అతన్ని భోజనానికి రమ్మంది అమ్మవారు. వ్యాసుడూ శిష్యులూ వస్తారు. ఆవిడ అ దరినీ కూర్చోబెట్టి గొడుగు బాగలు గిల్కలు కులు రింప వడ్డనచేస్తుంది. భవనభర్త తాపసులకు అన్నంధారపోస్తారు. తర్వాత ఆ మహాదేవి.

ఆరగించితె కడుపు నిండారనీవు
శిష్యతతి భోజనము చేసెనే యధేచ్ఛ

అని అడుగుతుంది. అప్పుడు యజమాని అంటే పరమశివుడు.

ఎట్టు పురాణముల్ పదియునెన్మిది చెప్పితి? వెట్టువేదముల్
కట్టితి వేర్పరించి నుడికారము సొంపెసలార భారతం
బెట్టు రచించి తీవుబుష్షి వెట్టియి తొక్కదినంబులోననే
పొట్టకులేక తిట్టెదవు పుణ్యగుణంబుల రాసి కాశికన్

అని వ్యాసుణ్ని మందలిస్తాడు. యీగాథలో వేదర్షి క్షుద్బాధ అన్న పూర్ణాదేవి పెద్దముత్తయిదువలా కనపడడం వడ్డనలూ భోజనాలూ తరువాత వ్యాసుణ్ణి శివుడు చెప్పడమూ ఇవన్నీ మానవ సహజంగా మన ఇళ్ళల్లో జరుగుతున్నట్టే అనిపిస్తాయి. ఇలాగే చిరుతొండినంబి కథ లోనూ మిగిలిన కథల్లోనూ.

స్వర్గలోకంలో తెల్లవారింది. పుంస్కోకిలాలు పారిజాత పల్లవాలు మేయడం ఐరావతం ఉషర్వీధికి వెళ్ళడం బాలవత్సంకోసం కామధేవు హుంకరించడం, శక్రుగడియారంలో శంఖారావం మోగడం అన్నీవర్ణించి తర్వాత శ్రీనాథుడు అంటాడూ

మాటుగా వైచిన మాంజిష్ఠతెరయెత్తి
పంజుమంటము దిగ్గెనుంజు ఘోష
మొకరి మద్దెలమ్రోతముద్దు జూపగరంభ
కనకంపు గొడుగు బాగారుదొడిగె
ఒకట వేసవిమడ్చి ఒక్కకేల ఘృతాచి
గాజారెక్కల తల్పుగడియ పుచ్చె
అలసభావముతోడ అలకోక ప్రమ్లోచ
నిల్వుటద్దంబులో నీడచూచె
హరిణి కీలించె నీలినపట్టాంశుకంబు
మేనక ధరించె పాలిండ్లమీద రవిక
అప్సరస్త్రీని కేతనాభ్యంతరముల
కొక్కొకోకో యటంచును కోళ్ళుకూసె

ఇలాగ దేవతల్ని మానవుల్లాగ చూపించడమే కాకుండా అతనేదృశ్యాన్ని వర్ణించదలుచుకున్నాడాన్ని స్పష్టంగా కళ్ళముందు పటంలాగా చూస్తాడు. కనుక చూపించగలుగుతున్నాడు.

సూర్యుడికి రథం ఉంటే ఆరథానికి ఏడుగుర్రాలుంటే దానికి అనూరుడనే సారథుంటే అప్రొద్దున ఉదయపర్వతం ఎక్కితే అది ఆపర్వత సానువులపైద దానిచక్రాలు కరకరమంటూ ప్రాకడం గుర్రాలు కళ్ళేలు లాగిపట్టి అనూరుడు వెనక్కి ఒరగడం అంతా ఏ రథమైనా ఏ కొండయినా ఎక్కేటప్పుడున్నంత నిజంగా బొమ్మ కడతాడు.

అలాగే అగస్త్యుడు వస్తున్నాడు వింధ్యపర్వతం అతనికి మొక్కుతుంది. మొగులుముట్టిన మహామూర్ధంబును భూమిమీద మోపుతుందట ఆకొండ తన గుహారంధ్రములు ప్రతిధ్వనుల నీనస్వాగత మిస్తుందట. వీటినిబట్టి అతనిలో స్పష్టచిత్రీకరణ శక్తేకాక సాహసోపేతమైన భావన కూడా కనపడుతుంది. విశాలమైనతెరా గాఢమైన రంగులూ బలమైన రేఖలూ ఇతని పరికరాలు. మొత్తంమీద ఇతనిది. భారీవాణి. శ్రీనాథున కింకొక శక్తి ఉంది. అతని కవితాస్రవంతి నిత్యపూర్ణవాహిని అడుగడునా ఉపనదులు వచ్చి పడుతుంటే ఆరుకాలాలూ నిండుగా ప్రవహిస్తున్నట్టుంటుంది. ప్రతిదినమూ ప్రతికార్యమూ కూడా పద్యములతోనే ప్రారంభించినట్లనిపిస్తుంది. పద్యరచన అతనికంత సులభమేకాకుండా మాట అంత సహజంకూడాను. అందుకనే కొన్నిచోట్ల విషయం మీద కన్నాకూడా రచనా ప్రౌఢత్వంమీదా, విన్యాసంమీదా ఎక్కువ మమత ఉన్నట్లు కనబడుతుంది. ఒక వస్తువర్ణన మొదలుపెట్టి ఒకపాదం అయ్యేసరికి మరిమూడుపాదాలు ఒకదానిమీద నొకటి ఉప్పెనలా తోసుకువస్తే వదులుకోలేడు. మరి వెంటనే ఇంతలో మరొకపద్యం తయారవుతుంది. కనుక సమయమాత్రం కొంచెం తక్కువేమో అనిపిస్తుంది. కవిబ్రహ్మ తిక్కన కవితలో చెప్పేది ముఖ్యమనిపిస్తుంది. శ్రీనాథుని కవితలో కొన్నిచోట్ల చెప్పే విధానం ముఖ్యమనిపిస్తుంది. అయినా అతని కావ్యం చదువుతున్నప్పుడు మాత్రం అతని కవితాధార మన మనస్సుల్ని ఒడిసి పట్టుకు లాగుకుపోతుంది. ఈ గుణంవల్లనే ఎంత చిన్నవిషయమైనా శ్రీనాథుని నోట రమ్యమైన పద్యంగా తయారౌతుంది.

బెండపూడి అన్నమంత్రికి ఎన్నోభాషలు వచ్చునట. ఉన్నవిషయమంతా ఇంతే ఇంకొక చప్పకవి ఐతే అన్నమంత్రి పెక్కుభాషలునేర్చెను పెక్కురీతి అని చప్పగా చెప్పుకోవచ్చు లేకపోతే పెద్దకవి అయితే ఆ విషయాన్ని పద్యంలో ఇరికించకపోవచ్చు. ఒకమాటలో లాగిపారవెయ్యవచ్చు. ఇక శ్రీనాథుడు ఏమంటాడో వినండి

అరబీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్రగాంధార ఘూ
ర్జరభాషల్ మళయాళభాష శకభాషా సింధుసౌవీర బ
ర్బరభాషల్ కరహాటభాష మరియున్ భాషా విశేషంబు ల
న్నెరుపై వచ్చునరేటి యన్నకి గోష్ఠి సంప్రయోగంబునన్

ఎంత వొయ్యారంగా ఉందోపద్యం....ఆ ఊరిచుట్టూ పొలాలు సారవంతాలు. అక్కడ కూరగాయలెన్నో దొరుకుతాయట దొస పొట్ల కాకర వంగ మొదలైనవి.

తరిపున పుష్పలతామతల్లీ పటోలికా
    కారవేల్లకుడుంగరములతోడ
కూష్మాండ వృంతాక కోలకదంబ కా
    కాయమాన కదంబకములతోడ
శాకినీ మూలకచ్ఛత్రాక సాకణీ
    ధాన్యాక మేఘ నాదములతోడ
పిప్పల్యపోదకీ పీతపలాండుక
    వాస్తుశాఖాకోటి వాటితోడ

రాజనలతోడ, శృంగబేరములతోడ
చిరుగడపు పెండలములతోడ చేమతోడ
ఒప్పునాలుగు పొలములందు పవనములు
భువన సారముపీఠికాపురవరమున

శ్రీనాధుడికి అన్నిరకాల భయ్యా సౌభాగ్యంమీద మక్కువ ఎక్కువ

## చాటువులు

ఈ లౌల్యమూ ఈ రచనా వాల్లభ్యమూ అతని జీవితయాత్రలలో నిత్యమూ అనేక చాటువులను చెప్పించాయి. శ్రీనాధుని చాటువులుగా ప్రసిద్ధికెక్కిన వాటిలో చాలావరకు అతనివే అనిలోస్తుంది. ఆ చాటువులలోనూ శృంగారనైషధ వ్యవహారికలలోనూ క్రీడాభిరామంలోనూ పల్నాటివీర చరిత్రలోనూ తెలుగుతనం ఎక్కువగా కనపడుతుంది. నిజానికి తెలుగు నాటి కవిఅంటే శ్రీనాధుణ్ని మొదట చెప్పాలి. ప్రౌఢదేవరాయల ఆస్థానంలో ఒకక. శ్రీనాధణ్ణి మీరు రెడ్డిరాజుల ఆస్థానంలో విద్యార్థి కారిగా ఉన్నప్పటికి బిరుదులేవీ చెప్పలేదే అని అడిగితే శ్రీనాధుడన్నాట్ట.

తరువున గాండివంబితడె ధర్మరాజునాన కిరీటి ఏను వా
క్సరసిజనేత్ర అనతి విచారము చొప్పున గర్వహీనతన్
మరలి తెనుంగుభూమి కసమానగతిన్ గొనిపోవు వాడనై
బిరుదులు నారివాగుకడ బెట్టిత సత్కవి సార్వభౌముడన్

ఆ జన్మాంతమూ ఆంధ్రదేశమంతటా ఆహారమూ శిష్యబృందముతో తిరుగుతున్నట్లు కనబడతాడు శ్రీనాధుడికి ఒక సంసారమూ ఇల్లూ వాకిలీ కట్టిపెట్టాలని ంచదు. ఎట్లు చెల్లింతు టంకంబు లేడు నూర్లు అన్న పద్యంలోని బాధలుకూడా అతనికి నప్పినట్లు కనబడవు. అతనిని అఖిలభోగాలకూ అభివార్చనకూ ఆస్థానమైన సప్తగోదావరం నుంచి బొద్దుపల్లికి పంపనేలేమ. అతడా కష్టాలు నిజంగా పడినా అతను పడ్డాడని మాత్రం ఒప్పుకోవాలని ఉండదు ఇవేళ ఇక్కడ విన్నన మంత్రితో హోమపాత్రాన్నం భుజించాడు. రేపక్కడ వీరభద్రా రెడ్డితో కస్తూరి పూసుకొన్నాడు. ఈనాడు సప్త గోదావరంలో క్రుంకులాడి భీమేశ్వ స్వామి పదసమాధానము కావించాడు. మరోనాడు రాయల ఆస్థానంలో విద్వత్సభలో కంచఢక్కలు పగులగొట్టించాడు. వీధిలో వాడలో విపణిలో జాతరలో ప్రభువుల ఆస్థానాలలో పండిత పరిషత్తులలో రకరకాల తరగతుల మనుష్యుల్ని రకరకాల ప్రకృతుల్ని పరిశీలించాడు అందరినీ పద్యాలతో పలకరించకుంటూ పర్యటన సాగిస్తుండేవాడు. ఆ చాటువుల్లో హాస్యమూ జీవమూ తెలుగుతనమూ వాటిని ఇప్పటికీ నిలబెట్టుకుని వచ్చాయి. వాటిలో అనాటి ఆచారవ్యవహారాలేకాక వీధులు భవనాలు వినోదాలు జాతరలు మాతెతలు చాకెతలు బ్రాహ్మణ స్త్రీలు జంగము రాంఢ్రు మంత్రులు దండనాయకులు రాజులు అన్నీ కళ్ళకు కట్టినట్లు కనబడతాయి. చక్రము విసిరితే అది చక్కిలంలా చొక్కడం

టాడు దాతనతిముక్క శోణంబుదాక కోనే అంటాడు. మరోచోట చదివె గురుకొండె ధర్మశాస్త్రములు తొలుత. పరమ విశ్వాస తాత్పర్య గరిమ చదివే చంద్రుండు కామశాస్త్రంబు పిదప తలిరుపాన్పున ననురక్తి తారయొద్ద అంటాడు. కొన్నిచోట్ల ఈహాస్యాన్ని లోకోక్తులవల్ల సాధిస్తాడు.

## శ్రీనాధుని ప్రతిభ

శ్రీనాధుడు సహస్ర మాసజీవి అయిఉంటాడు సంపూర్ణంగా సరసంగా జీవితం సాగించి ఉంటాడు. జీవితంలో వెలుగునీడయూ కష్టసుఖాలూకూడా బాగాతెలుసుకుని ఉంటాడు ఎక్కడపుట్టాడో ఏఊరో మనకెందుకు? తెలుగునాడంతా ఇతనిదే. శిష్యులతో నడుస్తూ విశ్రమిస్తూ కాలువుంటూ ఎప్పుడూ కవితావ్యాసంగం చేసిఉంటాడు. ఇతనిజీవితం అవిశ్రాంతమైన కవనోత్సవం. ఆరోజుల్లో ఈ మహాకవివల్ల కవిత్వం ఒక ఉద్యమంగా వ్యాపించి ఉంటుంది. ఎందరో మానవసంఘంలో అంత పూనుకుని తిరిగిన వాస్తవిక జీవి కనక ఇతర కవులెందరిలోనూ లేనంత హాస్యరసం ఇతనిలో వెల్లివిరిసింది. అది చాటువుల్లోనే కాదు అతని కావ్యాల్లోకూడా

## హాస్య రసం

అన్నపూర్ణాదేవి వ్యాసుడికీ శిష్యులకీ ఉచితాసనాలువేసి చిగురుటాకుల పరిపించింది. వడ్డనమాత్ర మేమీలేమ. పంక్తి పంక్తికీ ఆమెవచ్చి ఇందరుకూడి శాంతిపరియింపుడు. మజ్జన మాచరింపుడు కానీయండి భోజనం అంటుంది. పంక్తి పంక్తి నడుమా నిలిచి ఆపోశనంబులు పోయిస్తూ ఉంటుంది. అప్పుడు వ్యాసుడూ శిష్యులూ అనుకుంటారు.

వండిన చొప్పునన్ పొగయు వాసనయున్ పొగపారుచందమున్
ఖాండసమృద్ధి సంపదయు పానవిభూతియు సర్వమంగళంబు

కాని

చల్లని సౌమ్యదృష్టియు ప్రసాదము మాధురియున్ వివేకమున్
వెల్లదనంబు మార్దవమును నిర్మలసత్వము చూడవచ్చినన్
కల్ల యొకింతయేని పొడగానగరా దరటాకు చూ నన్
ఝుల్లనెగుండె యోగిరము శాకములన్ పొడగానరామికిన్

అలాగే దక్షాధ్వరధ్వంసంలో వీరభద్రుని మీసికి విష్ణుమూర్తి చిలర కవులు శ్రీనాధుని శిష్యులమని చెప్పుకొని విర్రవీగేవారని తోస్తుంది. నెల్లూరునుండి కొండవీటికి వెడితే అక్కడ కొండవీటివారి ఉత్సవం. కొండవీటినుంచి రాజమహేంద్రవరం వెడితే అక్కడ కవికమలవనానికి సూర్యోదయం. నేటికీ శ్రీనాధుని కావ్యం చేతిలోపడితే కవికోటికి పండగ. శ్రీనాధుడు కవులకవి.

# తెలుగు కావ్యాల్లో ప్రజా జీవితం

( ..వ పేజీ తరువాయి)

అనే వినయపూర్వకమైన ఉపచారవాక్యాలు వినపడేవట. ఇదంతా శ్రీకృష్ణదేవరాయల కాలపు భాగవతోత్తములైన శ్రీవైష్ణవుల జీవితంగా మనం భావించవచ్చు.

ఇక ఇతరులైన సాధారణ జీవితవిశేషాలు ఆ మహారాజు ఏవిధంగా చిత్రించినాడో వినండి. ఎండకాలం వేసవజాముననే పొలాలకు చేనులకు ఏతం తొక్కి నీళ్ల పారిస్తూ కర్షకులు పాటలు పాడుతుండేవారట. ఆ జానపదుల సంగీతం శ్రీకృష్ణదేవరాయల వారిని ఎంతగా ఆకర్షించిందో వినండి.

ప్రాతర్వేళల నట్టిపెట్ట సొగసై వాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వని వాద్యమై మధుదధఃపుంజీభవత్సాటల
వ్రాతామ్రేడితసిక్త భూసురభికారామంబు కుల్యాబహు
స్రోతస్సంఘల సంఘయంత్రనతికృత్పోద్గీత
గేయౌఘముల్,

ఎఱ్ఱటెండల్లో దప్పితో తూలుకుంటూ సోలుకుంటూ చేరుకొని అమ్మా అక్కా అని కడుపునిండా నీళ్ళు తాగిన తర్వాత బడలిక తేరి ఆ ప్రపాపాలికలను ఎగాదిగా కాముకత్వంతో చూచేవారట. సాంధులు. వర్షాకాలంలో హాలజీవ సందోహాలకు మంచి వెదలు దొరికినవనీ సంతలకూటములు విచ్చుకపోయినవనీ, మంటి మిద్దెలవారు పైనున్న వర్షంవల్ల కరిగి ఇంట్లో కురవటం చేత ఇటునుండి అటూ అటునుండి ఇటూ పడకలు మార్చటంచేత రాత్రిళ్ళు నిద్రకు చెడేవారనీ, నిరుపేదలైన హాలికులు కూడా దున్నతో ఎడ్లో దొరికిన పశువులతో బీటిచేలూ చేరుమళ్లూ దున్నటం ప్రారంభించారనీ నానిపోయిన వంటచెఱకులమూలాన పొయ్యి రాజక ప్రజలకు బోనాలు జక్కులబోనాలయినవనీ, బోరున వర్షం కురుస్తుంటే పిడుగు చప్పుళ్ళకు భయపడే అబలలు గుడిసెలో నుండే కడపదాటకుండా కంచాలు కడిగినసీళ్ల బయటికి చల్లేవారనీ, రాయలవారు వర్ణించినారు. జడివాన కురిసేటప్పుడు అటూ ఇటూ పోయే బాటసారులు తలదాచుకోవటానికి ఓ చోట చేరినవాళ్ళు ఉబుసుపోకకు రాజకీయాలు ముచ్చటించేవారట. ఒకడు అశ్వపతి బలుడంటే మరొకడు గజపతి బలవత్తరు డనేవాడట వేరొకడు నరపతి బలవత్తముడనేవాడట. ఈవాదోపవాదాలు ముదిరి పోట్లాటకు దారితీసేవి. ఇంతలోగా వానవెలిస్తే ఎవరిదారిని వారు పోయేవారు. ఈ వర్ణనం యీనాటి రైలు ప్రయాణాల్లోనో హోటల్లోనే కాసేపు కూడి ఉబుసుపోకకు రాజకీయాలు మాట్లాడుకునే వాళ్లను కలపిస్తుంది. ఇంకా వానకాలంలో జమ్ముగూడలు కప్పుకొని తమ తమ భర్తలకు పొలాలకే అంబళ్ళు తీసుకుపోయే కాపుగుబ్బెతలను రాయలువారు ఎంతో మనోహరంగా చిత్రించినారు. చలికాలంలో గురుగు. చెంచలి, లేత తరిగిసాకు కలిపి వేపుడుగా వండిన కూరలు పొట్టి అరికలబువ్వ తిని, తమ కొడుకులు చేనులు కాయబోతే. తాము మాత్రం మేకెదుర్కుంపట్లు పెట్టుకొని దగ్గరే కట్టివేసిన దూడలు తమ బిఱ నాకుతుంటే మంచానెక్కిన రెడ్ల ప్రాభవాన్ని, చెరుకు తోటలు, రాజనపుచేను కాపాడుతూ, చిలుకలను, పిట్టలను అదలిస్తూ పాటలు పాడుకుంటూ తమను త్రోవ అడిగే సాంధులను పెడదారులు త్రొక్కిస్తూ నవ్వుకునే చేలకాపరి పడుచుల హావభావాలు రాయలవారు వర్ణించినారు. ఇదంతా ఆనాటి కర్షకజీవుల జీవిత ప్రతిబింబం కాక మరేమిటి?

రాయలనాటి మాలదాసరి వేషం ఇట్లా ఉండేది. చవలరంటిన చర్మకూర్పాసము, కుల్లా, శంఖచక్రాల ఇత్తడి చెవుల పువ్వులు, దివెదారికొమ్ము, తోలుతిత్తి మొగిలాకు గొడుగు, గుఱ్ఱపు వెంట్రుకలతో కుట్టిన ఓటి సొరకాయ దండె, చిటితాళాలు, తులసిపూసల పేర్లు, మాసిన శరీరం, పద్దెనామాలు. పసుపు గుడ్డలతో తిరిగేవాడు. అగ్రవర్ణాలవాళ్ళ కనపడితే ఎండలోనైనా వానలోనైనా ఎంతో దూరం తొలగి నిల్చుంటే వాడు ఆ మాలదాసరి పై మూడు వర్ణాలవాళ్ల అతనికేమీ పెట్టేవారు కాదు. త్రివర్ణేతరుడు దయతో పెట్టిన అన్నం మాత్రం దూరంనుండే దండె సాచి అందుకొని తినేవాడు. గుడిగోపురాల్లో పోవటానికి వీలే లేదు. ఎక్కడో బయటి సీటి తూపురం దగ్గరే ఉండి భగవత్సేవ చేసేవాడు దేవాలయ బహిరావరణ ప్రదక్షిణం మాత్రం చేసి సంతృప్తిపడి తిరిగి తిరిగి తన పట్టెచేరుకునేవాడా పరమభక్తుడైన మాలదాసరి. వీళ్లకు చందాలవాటికల్లో పసితనం గల కొత్త చెప్పులు కొని వాటికి నూనె పూసి మెత్తపడటానికి తంగేడాకు కట్టడం కూడ ఒక సరదా. ఆ సొగసుతనానికి పతాకగా కనుబొమలసందున కొరిగింపుకోవటం కూడ ఆనాటి శృంగారమే. ఆనాడు పూటకూళ్ళిండ్లు ఉన్నట్లే అభ్యంగనపు అంగళ్ల కూడా ఉండేవి. ఇట్టి వేషకాండ్లు డబ్బులిచ్చి వేడినీళ్ళు కొనుక్కొని ఆయంగళ్ళలో అభ్యంగనం చేసేవారట. ఈనాడు ప్రత్యేకంగా యీ వేడినీళ్ళ అంగళ్లు ఎక్కడా ఉన్నట్లు కనపడవు ఒక్క తిరుపతిలో తప్ప. ఈ వర్ణనలన్నీ చూస్తుంటే ఆ కృష్ణదేవరాయలు తమ సమకాలీన ప్రజాజీవితాన్ని ఎంత సూక్ష్మంగా పరిశీలించి గ్రంథస్థం చేసినాడా అని ఆశ్చర్యం కలుగుతుంది.

---

**విజయవాడ–బి**

200 మీ (1500 కిలోసై)

వివిధభారతి (రిలే)

ప్రసారము I ఉ॥ 7-00 నుండి 9-30
,, II 0-15 నుండి 2-30
,, III .. 2-00 నుండి 5-30
,, IV సా॥ 6-30 నుండి రా॥ 10-40 వరకు

[శనివారం మాత్రం IV ప్రసారము రాత్రి 11-10 గంటల వరకు]

[వివరాలు 48-వ పేజీలో]




జనవరి 16-వ తేదీ మంగళవారం నుండి జనవరి 31-వ తేదీ బుధవారం వరకు

I వ ప్రసారము
ఉ॥ 7 00 నుండి 9 30
II వ ప్రసారము
10 5 నుండి 12 30 వరకు
III వ ప్రసారము
మ॥ 2 00 నుండి 5 30
IV వ ప్రసారము
సా ॥ 6 30 నుండి 10 40
శనివారములు IV వ ప్రసారము
6 30 నుండి రా॥ 11-10 వరకు

ప్రసారము I
00—8 30
49 71 మీ (608 కిలోసై)
7 00—9 30
1 82 మీ 60 (కిలోసై)

7 00 సంతన్‌వాణి భక్తిగీతావళి

30 అర్చన

40 ఝలక్ కార్యక్రమ విశేషాలు
కావ్యమాధురి
[ఆదివారములలో]
జీవన్ జ్యోతి
[మిగతా రోజులలో]

7 45 ఉదయగాన్

8 00 మంజూషా
జానపద ప్రాంతీయ సంగీతం

8 15 హిందీలో వార్తలు

8.30 జయమాల

9.30 ప్రసార సమాప్తి

ప్రసారము II
10-15—12-30
31.55 మీ (9510 కిలోసై)

10-1 రసవంతి

10 3 రంగ్ తరంగ్

10.50 హిందీలో వార్తలు

10.55 సంగీతసేతు

11.00 జయమాల

ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు

1 30 చిత్రధ్వని
సంక్షిప్త శబ్దచిత్రం (హిందీ)
(ప్రతి నెలా 1, 3, 5 ఆదివారములలో పండుగ రోజులలో)
రత్నాకర్
సంగీతం, హాస్య రచనలు, పాతకథలు
(ప్రతి నెలా 2, 4 ఆదివారాలు పండుగ దినాలు)

12 00 జయమాల

12 30 ప్రసార సమాప్తి

మ ప్రసారము III
25.36 మీ (1830 కిలోసై)
3077 మీ 9750 కిలోసై)
(ఆదివారాలు పండుగ దినాలు)

00 అప్నాఘర్
మీ యింట్లో అందరికి
(వారములో ఇతర రోజులలో)

2-00 ఫుల్వారి సంగీత కదంబం
(వారములో అన్నిరోజులలో)

2 30 మనోరంజన్

3 30 చౌలోరా పాటలు కిటలు

కర్ణాటక సంగీత కార్యక్రమము

3 45 అంజలి-గీతావళి

4-00—5-30
31.20 మీ (9615 కిలోసై)
4-00—4-30
31.33 మీ (95 5 కిలోసై)

4 00 గీతమాలిక

4.30 మధురగీతం
మీరు కోరిన పాటలు
(ఆది, బుధ, శుక్రవారములు

5 30 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV
6-30—9-30
31.33 మీ (9575 కిలోసై)
6-30—10-40—11 10
49.30 మీ (603 కిలోసై)

6 00 జయ్ భారత్
జాతీయ సమైక్యతా గీతాలు

6 45 జయమాల
యుద్ధ సైనికులకు

7 45 వాద్యమాధురి
వాద్య కదంబం

8 00 గజరా

8 15 హిందీలో వార్తలు

8 30 మెహ్-ఫిల్ కదంబం

8 45 చిత్రశాల
పరిచయ కార్యక్రమము

9.00 చతురంగ్ పాటలు

9 15 హవామహల్
నాటికలు, రూపకములు
హాస్యరచనలు

9 30 మన్ చాహే గీత్
మీరు కోరిన పాటలు

0 30 నూపుర్

0 3 హిందీలో వార్తలు

10 40 ప్రసార సమాప్తి

శనివారములు

10 30 గీతమంజరి లలిత సంగీతం

11 00 నూపుర్

11 05 హిందీలో వార్తలు

1 10 ప్రసారసమాప్తి

బెంగళూర్—బి
365.9 మీ (820 కిలోసై)
వివిధభారతి (రిలే)

| | | |
|---|---|---|
| ప్రసారము | I | ఉ॥ 7.00 నుండి 9.30 |
| „ | II | „ 1015 నుండి 1 30 |
| „ | III | మ॥ .00 నుండి 5 30 |
| „ | IV | సా॥ 6 30 నుండి 10.40 వరకు |

శనివారం మాత్రం IV ప్రసారం రా॥ 11.10 గంటల వరకు

ఇతర వివరములకు : ప్రొడ్యూసర్ 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్ట్‌బాక్స్-4, బొంబాయి 1.

Printed at Arutperunjothi Press, Madras-1—Edited and Published by the Station Director, All India Radio, Madras-4.



మ్రినాల్ సెన్: **"Experimental Films"** ను గూర్చి వీరితో పరిచయం
(మద్రాస్, జనవరి 27)



కొత్తపల్లి కోటీశ్వరరావు: తేనెటీగల పెంపకమునుగూర్చి వీరితో పరిచయం
(విజయవాడ, జనవరి 17)

  

వ్యవసాయ విజ్ఞాన ప్రశ్నోత్తర కార్యక్రమములో పాల్గొన్నవారు (ఇటీవల విజయవాడ కేంద్రంనుండి ప్రసారితం)

Regd. No. M. 5404



సెంపొన్నార్‌కోయిల్ ఎస్. ఆర్. డి. ముత్తుకుమారస్వామి, ఎస్. ఆర్. డి. వైద్యనాథన్: నాదస్వరం (మద్రాస్, జనవరి 16)



వివిధభారతిలో 'జయమాల' కార్యక్రమాన్ని నిర్వహించుచున్న సినీతార హేమమాలిని (జనవరి 27, 28

'తరుణభారతి' యువజనుల కార్యక్రమంలో "ఏ కే వృత్తి చేపట్టాలని ఉంది" అను విషయంపై జరిగిన చర్చలో పాల్గొన్నవారు (ఇటీవల విజయవాడ కేంద్రంనుండి ప్రసారితం)